నవశిక్షిత సాహిత్యమాల

# సోన్ కొండ రహస్యం

చిత్రా నాయిక్

అనువాదం

ఎమ్. కృష్ణకుమారి

చిత్రాలు

సుబీర్ రాయ్




నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

సోన్ కొండ మీద మోరాదేవి గుడి వుంది. ఆ కొండ కింద తూర్పు దిక్కున పార్‌గావ్ అనేవూరు వుంది. పూర్వకాలంలో మోరాదేవి ఎంతో మహిమగల దేవత. కాని ఇప్పుడు ఆ గుడి చాలా పాడు పడి వుంది. గుడికి వెళ్ళే దారంతా దట్టంగా పొదలతో కమ్ముకు పోయింది. సన్నని కాలిబాట మాత్రం వుంది. ఆ దారంతా ముళ్ళు, గుచ్చుకునే రాళ్ళు. గుడి చుట్టూ రావి చెట్లు, మర్రి చెట్లు అడవిలా పెరిగాయి. చీకటి పడితే ఊరి వాళ్ళెవరూ అటువైపుకి వెళ్ళరు.

ఆరునెలల కిందటి సంగతి. పార్‌గావ్ ఊరుకి చెందిన గొర్రెల కాపరి తప్పిపోయిన మేకను వెదుక్కుంటూ ఆ వైపు వెళ్ళాడు. మోరాదేవి గుడి చేరాడు. అది సాయంకాలం. గుడి వెనక వైపు నుండి వెలుగు కనబడింది. గొర్రెల కాపరి ధైర్య వంతుడు. మెల్లిగా గుడి వెనుకకు వెళ్ళాడు. అక్కడ మంట మండుతూ వుంది. ఆ మంట పక్కనే గెడ్డం వున్న వస్తాదు హుక్కాపీలుస్తూ కూర్చున్నాడు. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. గొర్రెల కాపరిని చూసి " ఎవరు నువ్వు? నిన్ను నేను తినేస్తా. మింగేస్తా. ఇలా నాముందుకి రా!" అని సింహంలా గర్జించాడు.

గొర్రెల కాపరి భయంతో పరుగెత్తి పార్‌గావ్ చేరుకున్నాడు. అతనికి నోటమాట రావడం లేదు. ఆ వూరికి కొత్తగా ఎన్నికయిన

సర్పంచ్ అతనికి ఎదురు వస్తూ కనపడ్డారు. ఆ కుర్రాడు సర్పంచ్‌కి మోరాదేవి గుడి వద్ద తాను చూసినదంతా చెప్పాడు. ఆయన విని నవ్వేసాగారు. ఇంటికి వెళ్ళి సర్పంచ్, భార్యతో గొర్రెల కాపరి చెప్పిన కథ చెప్పారు. అదివిని ఆవిడ " అలా నవ్వులాటగా తీసి పారేయకండి. ఆ కుర్రాడికి మోరాదేవి దర్శనమయిందేమో" అంది.

సర్పంచ్ ఇంకా నవ్వేసాగారు. " ఆ కుర్రాడు చూసినది గెడ్డం వున్న మగమనిషిని. మోరాదేవి కి గెడ్డం వుంటుందా?" అన్నారు.

"మోరాదేవి రకరకాల రూపాలతో దర్శనమిస్తుంది. మీరు నలుగురితో కొండ మీదకు వెళ్ళి చూసిరండి. లేకపోతే తర్వాత పశ్చాత్తాప పడవలసి వస్తుంది" అంది సర్పంచ్ భార్య.

సర్పంచ్ " నిజమే! గ్రామానికి బాధ్యాత నాదేకదా! ఇందులో ఆలస్యం చేయకూడదు" అని ఆలోచించారు.

సర్పంచ్ తన యువమిత్రుల్ని పిలిపించాడు. మర్నాడు సాయంత్రం వారంతా గుడివైపు బయలుదేరారు.

(2)

"అయ్యో రామా! ఇదెక్కడి వంకర టింకర దారిరా బాబోయి!" అంటూ సర్పంచ్ మిత్రులలో ఒకడు కిందపడి పోయాడు. మిగిలిన యిద్దరు యువకులు కలసి అతనిని కష్టం మీద లేవదీసి నిలబెట్టారు. సర్పంచ్ వారికి ముందుగా నడుస్తున్నాడు. ఆయన, ఆగి మిత్రులతో "కాళ్ళకు, చేతులకు దెబ్బలు తగల్లేదు కదా?" అన్నారు.

"ఫర్వాలేదు. బతికి పోయాను. చెప్పులు మాత్రం తెగిపోయాయి," అన్నాడు మిత్రుడు.

"మీరు చెప్పుల సంగతి చెబుతున్నారు. నా చొక్కా చూడండి.

కొత్త చొక్కా ఎలా చినిగి పోయిందో! మొన్ననే పదమూడు రూపా యలు పెట్టి కొన్నాను. నాశనమయింది" అన్నారు సర్పంచ్.

మరోమిత్రుడు " ఇప్పుడు దేవిని కొత్త చొక్కా ఇమ్మని కోరు కోండి సర్పంచ్‌గారూ!" అన్నాడు.

అందరూ నవ్వేసాగారు. ఆ సాయంకాలం భయం కల్గిస్తూ వుంటే నవ్వులతో ధైర్యం తెచ్చుకున్నారు.

కొంచెం దూరంలో ఎవరో భజన చేస్తూ పాడుతున్నారు. అందరూ ఆగిపోయారు. చటుక్కున భజన కూడా ఆగిపోయింది. సర్పంచ్ ధైర్యంచేసి ముందుకు నడిచాడు. పడిపోయిన పాత గుడి ఆయనకి కనిపించింది. గోపురం పైన నాలుగు వైపులా అడవిగడ్డి మొలిచి వుంది. గుడిలోపల పూజారి కూర్చుని వున్నాడు. ఆ పూజారి బాగా లావుగా, గడ్డంతో వున్నాడు. అతన్ని చూసి అందరూ కంగారు పడ్డారు. " ఎవరు మీరు? ఇక్కడికి ఎందుకు వచ్చారు?" అని పూజారి అరిచాడు.

సర్పంచ్ ముందుకి వెళ్ళి, వంగి " బాబా! నేను పార్‌గావ్ సర్పంచ్‌ని. వీరంతా నామిత్రులు. దేవిదర్శనం కోసం వచ్చాను. కొత్తగా పూజారి వచ్చారని తెలిసింది. చూద్దామని వచ్చాము, బాబా! మీరు ఇక్కడ ఎప్పటి నుంచి వున్నారు? మీపేరేమిటి? ఎక్కడి నుంచి వచ్చారు?" అని అడిగారు.

అదివిన్న పూజారి బిగ్గరగా నవ్వాడు. "నాపేరా? నాపేరు అడుగు తున్నావా? అయితే విను. నాపేరు 'అగడబంబ్' అంటారు. నేను మోరాదేవి పూజారిని. మావూరు భోర్ పాటన్. నేను బీహారు రాష్ట్రానికి చెందినవాణ్ణి అక్కడ మోరాదేవి అసలు విగ్రహ ఆలయం వుంది. అక్కడ నలుగురు పూజారులు దేవికి సేవలు చేస్తారు. దూర ప్రాంతాల నుండి ప్రజలు అక్కడికి వస్తారు. మోరాదేవికి మొక్కు

కుంటారు. అక్కడి పెద్ద పూజారిని నేను. ఇక్కడికి ఎందుకు వచ్చానో తెలుసా? ఒకరోజు సాయంత్రం మోరాదేవి నాకు ప్రత్యక్షం అయింది. ఆవిడ మెరుపులా మెరిసి పోతోంది.

బిడ్డా! మరాఠీ దేశంలో సోన్ కొండ వద్ద 'పార్గావ్' అనే వూరు వుంది. అక్కడ నాపురాతన ఆలయం వుంది. కాని ఆ వూరివారు దానిని మరిచిపోయారు. ఎవరూ పూజలు చేయటానికి రావటం లేదు. నవమినాడు బలి ఇవ్వడం లేదు. కాబట్టి నేను పార్గావ్ మీద అలిగాను. బలి ఇవ్వని కారణంగా నాకు ఆకలిగా వుంది. నాకు ఆహారం ఇవ్వకపోతే పార్గావ్‌ను నాశనం చేస్తాను. నాలుగైదు నెలలు చూస్తాను. బలి ఇవ్వకపోతే భూకంపం వస్తుంది. నువ్వు వెళ్ళి పార్గావ్ ప్రజలకు ఈ విషయం చెప్పు. వారు మోరాదేవిని సరిగా చూసుకోవాలని, దేవి చాలా కోపంగా వున్నదని చెప్పు" అంది.

నేను దేవి కోపం చూసి " ఓ మోరాదేవీ! తల్లీ! పార్గావ్ ప్రజలు చదువు లేనివారు. చిన్న గ్రామం. భూకంపం వస్తే ఆ వూరు నిమిషాలలో నాశనం అవుతుంది. ఆ వూరిని కనికరించు తల్లీ! నేను పార్గావ్ వెళతాను. సోన్ కొండ మీద ఆలయంలో నీ పూజ చేస్తాను. ఎన్ని రోజులు అవసరమయితే అన్ని రోజులు బలి ఇవ్వడానికి ఏర్పాటు చేస్తాను. ఆ వూరిని నాశనం చేయవద్దు," అన్నాను.

అలా చెప్పి పూజారి సర్పంచ్ కేసి తిరిగాడు. " మీరు బలి తీసుకు రాకుండా చేతులూపుకుంటూ వచ్చారా? వట్టి చేతులతో వస్తే వూరికి త్వరలో నాశనం తప్పదు," అన్నాడు.

అది విని సర్పంచ్ కంగారుపడ్డారు. ఆయన తో వున్న మిత్రుడు ధైర్యం చేసి పూజారిని "స్వామీ! బలికి ఏమికావాలి?" అని అడిగాడు.

పూజారి ఒక్క క్షణం ఆలోచించి " చూడండి. ప్రతి నవమి రోజు సాయంత్రం ఒక కోడి పుంజును తీసుకు రావాలి. చీకటి పడే లోగా తెచ్చియివ్వాలి. మొత్తం ఇరవై నాలుగు కోడి పుంజులను ఇవ్వాల్సి వుంటుంది. బలి ఎవరు తీసుకురావాలో మీరు నిర్ణయిం చుకోండి. వెళ్ళండి. వట్టి చేతులతో వచ్చే భక్తులంటే దేవి కిష్టం వుండదు" అన్నాడు.

అప్పటి నుండి ప్రతి నవమికి ఒక కోడి పుంజు దేవికి చేరుతూ వుండేది. " మోరాదేవి దయవలన ఇప్పటికీ పార్గావ్‌కి భూకంపం రాలేదు. అప్పుడప్పుడు నేల కొద్దిగా అదురుతుంది. కాని ఏ ప్రమాదం జరగలేదు," అనేవారు ప్రజలు.

(3)

పార్గావ్ వూరిలో పూజారి కనబడేవాడు. చీకటి పడేసరికి నూనె, నెయ్యి, మసాలా దినుసులు కొనుగోలు చేయడానికి వూరిలోకి వస్తాడు. ఎవరైనా పలకరించబోతే జవాబు చెప్పడు. వూరిలో ఎవరి తోను పరిచయం పెట్టుకోడు. చీకట్లోనే కొండమీదకి తిరిగి వెళ్ళి పోతాడు.

నవమినాటి సాయంత్రం. కొండమీద వింతధ్వని వినిపించేది. భూం! భూం! భూం! అంటూ భయం కలిగించే శబ్దం వినబడేది. ఎవరో ఒకసారి పూజారిని ఆ శబ్దం ఏమిటని అడిగితే " మోరాదేవి బలి స్వీకరించి మింగుతున్నప్పుడు అలాశబ్దం వస్తుంది," అని చెప్పాడు.

ఒకసారి పార్గావ్‌కి పోలీసులు వచ్చారు. బొంబాయిలో పెద్ద దొంగతనం జరిగింది. దొంగలు బంగారం పట్టు కుపోయారు. దొంగలు

తప్పించుకుని " పాతసిరిపురం గ్రామంలో తలదాచు కున్నారు " అని పోలీసులు చెప్పారు. పోలీసులు ఎంతో వెతికారు. మోరాదేవి గుడి చూద్దామని పోలీసులు వెళ్ళారు. పూజారి కళ్ళు మూసు కుని వున్నాడు. పోలీసులను చూడగానే " మీరెందుకు వచ్చారు? నాధ్యానానికి భంగం కలిగించడానికా? మోరాదేవి మిమ్మల్ని నాశనం చేస్తుంది" అని బిగ్గరగా అరిచాడు. పోలీసులు చాలా సేపువెతికి తిరిగి వెళ్ళి పోయారు.

(4)

దీపావళి సెలవులు మొదలయ్యాయి. పారగావ్‌కి చెందిన యువ కులు కొందరు బొంబాయిలో చదువుకుంటున్నారు. సంతూపాటిల్ కొడుకు సుభాష్, కాలేజీలో చదువుతున్నాడు. బస్‌దిగిన వెంటనే స్నేహితులు అతని చుట్టు చేరారు. వూరిలోని విశేషాలు ఒక్కొ క్కటీ చెప్పసాగారు. గ్రామానికి పోలీసులు వచ్చారని సుభాష్‌కు తెలిసింది. " మోరాదేవి ఆలయ పూజారి గొప్ప శక్తులుగలవాడు. ఎవరినీ దగ్గరకు రానివ్వడు. ప్రజల్ని భయపెడు తున్నాడు," అని మిత్రులు సుభాష్‌తో చెప్పారు.

సుభాష్ మిత్రులతో " ఇందులో ఏదోమోసం వుంది. మనం తెలుసుకోవాలి. ఈ రోజు సాయంత్రం మా ఇంటికి రండి. ఏం చేయాలో నిర్ణయిద్దాము. కిషన్, వికాస్, రాజేష్, మాధవ్, ఆనంద్! మీరంతా తప్పక రావాలి" అన్నాడు.

రాజేష్ " ఇంట్లో వాళ్ళకి మనం వెళ్తున్నట్టు చెప్పాలేమో! ప్రతి నవమి నాడు కొండ మీద నుండి భూం! భూం! భూం! అని భయం కరమైన శబ్దం వస్తోంది. అందువలన భయమేస్తోంది. భూతం

మనల్ని భయపెడితే, మనం కొండ మీద నుండి తిరిగి రాలేక పోతే ఎలా? ఇంట్లో వాళ్ళకి మనం ఎక్కడ వున్నామో తెలియాలికదా!" అని అడిగాడు.

" చూడు, భూ తాలను నేను ఒక్కడినీ ఎదుర్కొంటా నీకు కొంచెం కూడా హాని కలగదు. నామాట మీద నమ్మకంలేకపోతే నువ్వురావద్దు. కాని మనపధకం పూరిలో ఎవరికీ తెలియకూడదు," అన్నాడు సుభాష్ రాజేష్‌తో.

యువకులంతా ధైర్యంగా బయల్దేరటానికి సిద్ధమయ్యారు. ఇదంతా చూసి రాజేష్ " నాకు చీకటంటే భయంలేదు. అడవి జంతువులన్నా భయంలేదు. ఇపుడు సుభాష్ చెప్పటం వలన ఇక భూతాలన్నా భయపడను," అన్నాడు.

(5)

నవమి నాటి సాయంత్రం మిత్రులంతా గుడికి వెళ్ళాలని నిశ్చయించు కున్నారు. గుడి నుండి భయం గొలిపే శబ్దం రావటానికి కారణం తెలుసుకోవాలి అనుకున్నారు. రెండు మూడు రోజుల పాటు సుభాష్, అతని మిత్రులు ఒక పధకం వేసారు. ఈ నవమి నాడు కోడిని బలి యివ్వవలసిన వంతు ఎవరిదో తెలుసుకున్నారు. భికాజీ అనే బీదరైతు కోడిపుంజును తీసుకెళ్ళాలి.

నవమిరోజు సాయంత్రమయింది. భికాజీ పెద్ద బుట్టలో కోడి పుంజుని పెట్టాడు. పసుపు, కుంకుమ, కర్పూరం కూడా తీసుకున్నాడు. అయిష్టంగా బుట్టను నెత్తిన పెట్టుకుని కొండ ఎక్కసాగాడు. పార్‌గావ్ గ్రామం నాశనం కాకూడదు. అందుకే ఇదంతా చేయవలసి వస్తోంది. పూజారికి కోడి పుంజును అప్పగించి భికాజీ కొండ

దిగసాగాడు. ఊరు దగ్గర పడుతుంటే భికాజీ మనసులో "ఈ పూజారి నిజమైన పూజారి అవునో? కాదో? ఆదేవుడికే తెలియాలి. ఎంత లావుగా బలిసాడో. కోడి పుంజుని అతనే తినేస్తున్నాడేమో! పేరు దేవతది. చేరేది పూజారికి" గొణుగు కోవటం ఆరంభించాడు.

సుభాష్ అతని మిత్రులు చాటుగా కొండ వైపు బయలుదే రారు. భికాజీ గొణుగు కుంటున్న మాటలు విని ఆనంద్ " మనం ఈ రహస్యం తప్పక కనిపెట్టాలి. మాబాబాయి బొంబాయి స్కూలులో పాఠాలు చెప్తాడు. భూకంపం రాకుండా మనం కోరు కోవచ్చునని చెప్పాడు. బలి ఇస్తేనే భూకంపం నివారించగల మనేది సరికాదు. పూజారి అబద్ధం చెబుతున్నాడు. అతను ఏదో రహస్యం దాస్తున్నాడు మనం ఈ రోజు పూజారి గుట్టు తెలుసుకోవాలి," అన్నాడు.

(6)

సుభాష్, వికాస్, ఆనంద్, కిషన్, రాజేష్, మాధవ్ అడుగులో అడుగు వేసుకుంటూ కొండ ఎక్కారు. చిన్నప్పుడు చాలా సార్లు వాళ్ళు ఈ కొండ ఎక్కారు, దిగారు. కొండమీద ప్రతి కాలిబాట వాళ్ళకు తెలుసు. ఇదివరకు భూకంపం వచ్చినప్పట్నుంచి కొండ మీదికి వెళ్ళడం మానుకున్నారు. పిల్లల్ని కొండ వైపు వెళ్ళకుండా పెద్దలు కట్టడి చేసారు.

మోరాదేవి గుడి ఒక పెద్ద రాతి కొండ మీద వుంది. కొండ మీద నుంచి గుడికి వెళ్ళేదారి సరిగా లేదు. ఒక్కసారి నిలువుగా పైకి ఎక్కవలసి వుంటుంది. కాలు ఏమాత్రం జారినా ఆ వాలులో దబదబ దొర్లు కుంటూ కింద పడిపోతారు. అలా మరణించినా మర

ణించ వచ్చు. అయినా సరే సుభాష్, అతని మిత్రులు ఆదారినే ఎంచు కున్నారు. అక్కడి ప్రతి చెట్టు, చేమ వాళ్ళకి తెలుసు. చెట్ల కొమ్మల్ని వూతగా పట్టుకుని రాళ్ళమీద పాదాలు పెట్టి నడు చుకుంటూ వాళ్ళు పైకి ఎక్కారు.

అది గుడి వెనకనున్న ప్రదేశం. అక్కడ ఒక పెద్ద బండరాయి వుంది. మిత్రులందరు దాని చాటున ఆగి ఊపిరి బిగపట్టి కూర్చు న్నారు. నాలుగు వైపులా పెద్ద పెద్ద మర్రి, రావి చెట్లనీడలు ఆవ రించాయి. అడవి చెట్ల తీగలు ఒకదానితో మరొకటి దట్టంగా పెన వేసుకున్నాయి.

నెమ్మదిగా చీకటి ముసురుకుంది. పిట్టల కిచకిచలు ఆగి పోయా యి. చటుక్కున ఒకే ఒక తీతువు పిట్ట ఆ బండరాయి చుట్టూ రెక్కలు కొట్టు కుంటూ ఎగిరింది. దాని కీచుగొంతు నిశ్శబ్దాన్ని చీలుస్తూ భయం కలిగించింది. మర్రి చెట్టు మీద కూచున్న గుడ్లగూబ ఆగి ఆగి అరుస్తోంది. వాతావరణం భయంగా వుంది. నల్లగా, లావుగా ఉన్నమోరాదేవి విగ్రహం చటుక్కున కాళికాదేవిలా బయటకు వచ్చి కోడి పుం జును తినేస్తుందేమో అనిపించే విధంగా కనబడింది. అబ్బ! ఎంతటి భయంకర ప్రదేశం.

కాని, ఒక్క క్షణంలో ఆస్థితి మారిపోయింది. పూజారి ఒక చేతిలో లాంతరు, మరో చేతిలో కాగడా పుచ్చుకుని వచ్చాడు. ఏదో సినీ మా పాట గొణుగు కుంటున్నాడు. మందిరం వెనక పెరటి వైపు వెళ్ళాడు. అక్కడ పెద్దరాయి మీద లాంతరు వుంచాడు. గెడ్డం గోక్కుంటూ కొంత సేపు అక్కడే నిలబడ్డాడు. పొయ్యి దగ్గర కాగడా పెట్టి గట్టిగా ఊదుతూ నిప్పు రాజేసాడు. కొద్ది కర్ర పుల్లలు పొయ్యిలో పెట్టి గుడిలోకి వెళ్ళిపోయాడు.

ఈ సారి ఈ కలు పీకి శుభ్రం చేసిన కోడి పుంజు అతని చేతిలో

వుంది. పొయ్యి బాగా రాజుకుంది. పొయ్యి బాగా మండటం వల్ల అక్కడ వెలుతురుగా ఉంది. పూజారి కోడిపుంజుని ముక్కలుగా తరిగి పళ్ళెంలో పెట్టాడు.

అందులో ఉప్పు, కారం, మసాలా దినుసులు వేసి మళ్ళీ గుడిలోకి వెళ్ళి పోయాడు. తిరిగి వచ్చినప్పుడు అతని చేతిలో నేతిడబ్బా, ఒక పెద్ద శంఖం వున్నాయి. పొయ్యి బాగా మండుతోంది. పూజారి పొయ్యి మీద ఉన్న వెడల్పాటి పాత్రలో నెయ్యి, కోడి మాంసం ముక్కలు వేసి చిన్న చెంబుతో నీరు పోసాడు. భుజం మీదున్న గుడ్డతో చేతులు తుడుచుకున్నాడు. వెనకనున్న అరుగు లపై రొమ్ము విరుచుకుని నిలబడి, బుగ్గలలో గాలిని పూరించి గట్టిగా శంఖం వూదాడు.

అన్ని వైపులా ఆ శబ్దం భయంకరంగా మారుమ్రోగింది. భం! భం! భం! భం! ఆశబ్దం ఎంతో భయంకరంగా వుంది. చీకటి కూడా భయపడే విధంగా వుంది. కొండ నాలుగు దిక్కులూ దాని ప్రతిధ్వని వినిపించింది. ఆధ్వనికి సుభాష్, అతని మిత్రులు భయపడ్డారు. కాని అనుమానం తీరిపోయింది. భం! భం! శబ్దం మోరాదేవి గర్జన కాదు. అది పూజారి వూదుతున్న శంఖం ధ్వని.

(7)

పూజారి మరొకసారి శంఖాన్ని గట్టిగా ఊదాడు. కొండ దిగువ నుండి జవాబుగా ఘూ! ఘూ! ఘూ! ఘూ! అనేశబ్దం వినిపించింది. ఆ అరుపు గుడ్లగూబ అరుపా, మనిషి చేసిన శబ్దమా? అని కుర్ర వాళ్ళు ఆలోచించసాగారు.

బాబా వంట పాత్ర మీద నున్న మూతతీసాడు. పాత్ర లో మరి

కొన్ని నీళ్ళు పోసాడు. ఘుమ ఘుమ వాసన చుట్టు పక్కలకు వ్యాపించింది. బాబా మూడవసారి శంఖం వూదాడు. భం! భం! భం! ఈసారి దీనికి జవాబుగా వచ్చిన శబ్దం దగ్గరగా వచ్చింది. కుఱ్ఱవాళ్ళు కంగారుపడి ఆ ధ్వని ఎక్కడినించి వస్తోందా? అని చూసారు.

గుడికి ఒక వైపున సిరిపూర్ గ్రామం నుండి వచ్చే దారి వుంది. ఇదివరలో భూకంపం వచ్చిన తర్వాత సిరిపూర్ గ్రామం నాశన మయింది. అప్పటి నుండి ఆ వూరి దారి కూడా పాడుపడింది. సిరి పూర్ లో ఇప్పుడు దొంగలే వుంటారని జనం చెప్పుకుంటారు. ఆ దారి మీదుగా ముగ్గురు మనుష్యులు కొండ ఎక్కుతూ రాసాగారు. వారిలో ఒకడు పొడుగ్గా వున్నాడు ఒతడు పొట్టివాడు. మరొకడు కుంటివాడు. ఘూ! ఘూ! ఘూ! శబ్దం అక్కడి నుంచే వస్తోంది.

ముగ్గురిలో పొడవుగా వున్న వ్యక్తి "ఏం? శంఖం గారూ! కోడి కూర ఈ సారైనా బాగా కుదిరిందా? కిందటి సారి లాగా మాడ్చి వేయలేదు కదా?" అన్నాడు.

పూజారి చాలా మర్యాదగా నిల్చొని "లేదండీ! ఈసారి బాగా వండాను" అన్నాడు.

పొడుగుపాటి సుభాన్‌రావు "కుంటీ! ఇక నీ వంకర కాలు సర్దుకో! కుంటిగా నడవక్కర్లేదు ముందు సరుకు దాచి వద్దాము. తర్వాతే మిగిలిన సంగతులు" అన్నాడు.

గుడి వెనక ఒక సెలయేరు వుంది. అక్కడ మఱ్ఱి చెట్టు తిన్నె వుంది. కుంటివాడు దానిమీదే కూర్చున్నాడు. "ఈ సారి చాలా బంగారం దొరికింది. పెద్ద పెద్ద పట్టీలు పది దొరికాయి. నడిచి నడిచి నాకాళ్ళు వంగిపోయాయి" అన్నాడు.

పొట్టి పాండు కళ్ళు రెపరెపలాడిస్తూ "చూడు కుంటీ! నీది

కుంటివాడి పాత్ర. అందు చేత నీకాళ్ళకు వంకరపడకే అలవాటు అయింది" అన్నాడు.

బండరాయి వెనక దాగిన మిత్ర బృందానికి వీరిమాటలన్నీ వినబడ్డాయి. వూరిలో బుధవారం జరిగే సంతలో ఈ కుంటివాడిని వాళ్ళు చాలా సార్లు చూసారు. ఒక సారి ముష్టివాడిలా బిచ్చమెత్తుకునేవాడు. మరొకసారి పాతబట్టలు అమ్మడానికి తీసుకువచ్చేవాడు.

మంచి సిల్కు పాగాలు, టెరీన్ బట్టలు, పాంట్లు కూడా తెచ్చేవాడు. అవి ఎక్కడివని ఎవరైనా అడిగితే "పట్నంలో ఒక దుకాణం వాడు నాకు తెలుసు. కమీషను మీద అతను ఈ సరుకు ఇస్తాడు. అమ్ముతూ వుంటాను. అమ్మిన తర్వాత లాభం వస్తే మళ్ళీ సరుకు ఇస్తాడు. ఇవ్వని రోజు బిచ్చమెత్తుకోవలసి వస్తుంది" అనేవాడు.

కుంటివాడు దొంగతనం చేసి బట్టలు తెచ్చి అమ్ముతూ వుంటాడని సుబాష్ బృందానికి అర్థం అయింది. దొంగతనానికి వీలైన చోటుని కనిపెట్టడానికి కుంటివాడు గ్రామంలో బిచ్చమెత్తుతూ ఉండవచ్చు. మోరాదేవి గుడి స్థావరం మీద ఎవరికీ అనుమానం రాదు కదా? అని ఆ చోటు చూసుకుని వుంటాడు.

సుభాన్‌రావు పొట్టి పాండును అదిలిస్తూ "కబుర్లు కట్టిపెట్టండి. అవసరాలకు కావలిసిన డబ్బు తీసుకుని మిగిలిన మొత్తమంతా ఇనపపెట్టెలో పెడదాం," అన్నాడు. జేబులో చేయిపెట్టి నోట్లు తీసి కుంటి వాడికిచ్చాడు. "ఇక ఇనుప పెట్టె తెరువు" అన్నాడు.

గుడివెనక గోడ, పెద్ద పెద్ద రాళ్ళతో కట్టిన గోడ. కుంటివాడు ఆ రాళ్ళతో పెద్దరాతిని చేతితో సర్ది తొలగించాడు. లోపల చాలినంత ఖాళీ చోటుంది. అక్కడ చిన్న చిన్న మూటలు, డబ్బాలు, చిన్న కర్ర పెట్టెలు వున్నాయి. సుభాన్‌రావు కుంటివాడితో



“మూడవనెంబరు డబ్బా బయటకు తియ్యి, దాంట్లో చాలా సరుకు వుంది. పోలీసులు దానిని గురించి వెతకటం మానివేసారు. దాన్ని బొంబాయి బజారులో అమ్మివేద్దాం. ఆ బంగారం సరిగా పెట్టు. పోలీసులు దానిని గురించి పట్టించుకోవడం మానివేసిన తర్వాత బయటకు తీద్దాము” అన్నాడు.

సుభాన్‌రావు పూజారి వైపు తిరిగి కళ్ళతో సూచిస్తూ "భాగోజీ! మోరాదేవిని బాగా చూసుకుంటూ వుండాలి. విగ్రహానికి మరి కొంచెం నూనె పూయండి. మెరుసున్న దేవత విగ్రహం భక్తులకు బాగా కన బడు తుంది" అన్నాడు.

"అలాగే దొరా! రెండు మూడు రోజుల తర్వాత మరి కొంచెం నూనె పట్టిస్తాను" అన్నాడు పూజారి.

గ్రామ ప్రజలలో మోరాదేవి అంటే భయం తగ్గకుండా వుండా లి. ఎవరికీ అనుమానం రాలేదు కదా? అని అడిగాడు.

నేను గ్రామ ప్రజలను బాగా భయపెట్టాను. ఇక అనుమానం గురించా! సర్లెండి గ్రామస్థులంతా చాలా అమాయకులు. నేను ఏది చెబితే అది చేస్తారు. ఈ నవమికి కోడి పుంజు కాదు మేక పోతును తీసుకురావాలి అంటే అలాగే చేస్తారు" అన్నాడు పూజారి.

"వద్దులే మనం నలుగురమే కదా వున్నది. గొర్రె నంతా మనమే ఎలా తినగలం? నిజం చెప్పాలంటే, మన భాగోజీ కోడికూర చాలా బాగా వండుతారు" అన్నాడు సుభాన్‌రావు.

తిండి మాట వినగానే పొట్టి పాండుకి నోటిలో నీరూరింది. బండాని చూసి "బండా డబల్‌రొట్టి చపాతీ తెచ్చావా" అని అడి గాడు పూజారి.

ఓ! రొట్టెల దుకాణం వాడికన్ను కప్పి నాలుగు డబల్‌రొట్టెలు సంచీలోకి తోసి, పరుగు లంకించాను, అన్నాడు బండా గర్వంగా.

" ఓరిగాడిదా! వేల రుపాయలు సంపాదిస్తున్నాం. రొట్టెల దుకా ణంలో డబల్‌రొట్టి దొంగిలించడం ఎందుకు? మతిపోయిందా? ఇలాటి తెలివితక్కువ పనులు చేస్తేనే పట్టుబడి పోతాము. నీకంటె మూర్ఖుడు మరొకడు లేడు." అంటూ కుంటి బండాను సుభాన్ తిట్టి పోసాడు.

" ఇంకెన్నడూ చేయను దొరా! ఏదో అలవాటు తప్పించుకో లేక పోయాను" అన్నాడు బండా వినయంగా

నడుంకట్టు కింద దాచిన కాగితం సంచీ నుండి సుభాన్ రెండు నోట్ల కట్టలు తీసాడు. అరుగుమీద పెట్టాడు. ఒక కట్టను పొట్టి పాండు తీసుకున్నాడు. మరొక కట్టను భాగోజీ పూజారి తీసుకున్నాడు. తర్వాత భోజనం చేయడానికి అంతాకూర్చున్నారు.

(8)

పారగావ్ యువకులు బండరాయి వెనక చిక్కుకుని పోయారు. ముందుకుపోలేరు. వెనకకురాలేరు.

కొద్ది నిమిషాలలో కింద నుండి బిగ్గరగా ఈల ధ్వని వినిపించింది. జవాబుగా సిరిపూర్ వైపునుంచి ఈల వినబడటంతో దొంగలు భోజనం ఆపిలేచి నిలబడ్డారు.

" పోలీసులుకు మన జాడ తెలిసినట్లుంది" అన్నాడు సుభాన్ రావు. అతను చెవులు రిక్కించి వింటూ పూజారిని ఇలా ఆదేశించాడు.

" భాగోజీ! పొయ్యిలో మంట మీద నీరు పోసేయి. కోడి మాంసాన్ని రొట్టెల్ని వెనకకు తోసేయి. పాత్రలను ఇనుపపెట్టెలో దాచేయి. నువ్వు దేవీ విగ్రహం ముందు కూచుని భజన చెయ్యి." భాగోజీ సుభాన్ చెప్పిన విధంగా చేయసాగాడు.

" కుంటిబండా! నువ్వు పార్గావ్ వైపు పో. కొంచెం సేపట్లో తెల్లవారి పోతుంది. ఈ రోజు బుధవారం. సంతరోజు కనుక నీమీద ఎవరికీ అనుమానం రాదు. సరిగా కుంటుతూ బిచ్చమెత్తుకో. నేనూ, పాండు బండరాయి చాటున దాగివుంటాం. పాత సిరిపూర్‌కి వెళ్ళే

దారి అటే పోతుంది. అది వంకర టింకరగా పోయే దారి కనుక పోలీసులు వెతకలేరు. ఒకవేళ వారు ఆ దారిలోనే బయలు దేరినా మమ్మల్ని పట్టుకోలేరు" అన్నాడు సుభాన్.

అక్కడే దాగిన సుభాష్ మిత్రబృందం ఈ కొత్త పథకం విని కంగారు పడ్డారు. కాని సుభాష్ వెంటనే మిత్రులతో " ఎవరినీ పారి పోనీయొద్దు. నేను, మాధవ్ సుభాన్‌రావును పట్టుకుంటాము. వికాస్ పహిల్వాన్ కనక తను ఒక్కడూ పొట్టిపాండును పట్టుకోగలడు. కిషన్, రాజేష్, మీ ఇద్దరూ కుంటి బండాను ఆపండి. ఆనంద్ పూజారిని కని పెడుతూ వుంటాడు. మనం తలపడాల్సిన సమయం వచ్చింది. సిద్ధంగా వుండాలి" అన్నాడు నెమ్మదిగా.

సుభాన్‌రావు " పూజారీ! వెళ్ళండి తొందరగా గుడి లోకి పొండి" అంటూ ఖాళీపాత్రలను ఇనుప పెట్టెలోకి తోసాడు. పూజారి రాయితో దానిని మూసివేసాడు. గుడిలో దీపం వెలిగించి భజన చేయసా గాడు. మధ్య మధ్యన గంటలు మోగించాడు. ఆగంటల శబ్దం నాలుగు వైపులా మారు మోగింది. పోలీసుల ఈల శబ్దం దగ్గరగా వినబడు తోంది.

" పోలీసులు పైకి వచ్చేసారు. బండా పారిపో!" అని సుభాన్ రావు పాండుతో బండరాయి వెనకకు పరుగుతీసాడు.

బండా పెద్ద పెద్ద అంగలు వేస్తూ పార్‌గావ్ గ్రామం వైపు వెళ్ళాడు. కిషన్, రాజేష్ చప్పుడు చేయ కుండా పరుగెత్తారు. చీకటిలో వారినెవరూ చూడలేదు.

ఇక్కడ వికాస్ కాలు అడ్డంపెట్టి పాండును కింద పడవేసాడు. సుభాష్, మాధవ్, సుభాన్‌రావును ఆపటానికి ఎంతో ప్రయత్నిస్తు న్నారు. ఎవరూ కిక్కురు మనడం లేదు. అయినా భాగోజీకి ప్రమాదం గురించి తెలిసిపోయింది. అతనికి పెనుగులాడు తున్న చప్పుడు



వినబడింది. పూజారి భజన ఆపిమెల్లిగా అడుగులేస్తూ గుడి వెనుక వైపు వెళ్ళి నిలబడ్డాడు. అక్కడే అనంద్ సిద్ధంగా కూర్చుని వున్నాడు. కొండ ఎక్కడానికి వుపయోగించే చేతికర్ర తీసివుంచాడు. బాబా బయటకు వచ్చి ఆగాడు. వెనుకనుంచి అడుగుల చప్పుడు అత నికి వినబడింది. ఎవరో "ఇటు, ఇటువైపు వుంటారు" అన్నారు. పోలీసులు పైకి వచ్చేసారు.

మాధవ్ గట్టిగా "ఇనస్పెక్టర్ గారూ! ఇలారండి. ఇక్కడ ఇద్దరు దొంగల్ని పట్టుకున్నాం. త్వరగా రండి" అంటూ అరిచాడు.

అదివిని పూజారి పారిపోబోయాడు. ఆనంద్ చేతికర్రతో భాగోజీ కాలి మీద గట్టిగా కొట్టాడు. భాగోజీ అరుస్తూ కిందపడ్డాడు.



అదే సమయంలో కిషన, రాజేష్ అతి కష్టం మీద కుంటి బండాను పట్టుకుని పైకి తెచ్చారు.

పోలీసులు చాలా మందే వున్నారు. దొంగలను పోలీసులకు అప్పగించి సుభాష్ అతని మిత్రులు ఒక వైపు నిలబడ్డారు. రాజేష్ ముందుకు వచ్చి పోలీసులకు ఇనపపెట్టె చూపించాడు. దొంగ సొత్తు అంతాదొరికింది. సుభాష్ అన్ని విషయాలూ వివరించాడు. కధంతా

విన్న ఇనస్పెక్టర్ ఆశ్చర్యపోయాడు. సుభాన్‌రావును సుభాష్, మాధవ్ ఆపకపోతే తప్పించుకుని పోయేవాడు. పోలీసులు సుభాన్‌రావును పట్టుకో లేక పోయేవారు. పొట్టిపాండు చిక్కేవాడు కాదు. అతన్ని పట్టుకోవడం లో వికాస్ కాలు మెలిపడింది. అయినా వికాస్ పట్టు వదలలేదు.

వికాస్, ఆనంద్ " ఈ దొంగల సంగతి గ్రామంలో అందరికీ చెప్పాలి. మనవాళ్ళు చదువుకోలేదు. అమాయకులు. అందుచేత ఈ దొంగలు వారిని నమ్మించి లాభం పొందుతున్నారు. ఈ మోసాన్ని మనం ఆపాలి. ఈ దొంగల్ని పార్‌గావ్ తీసుకెళ్ళాలి. ఈ దొంగలు వూరివాళ్ళను క్షమాపణ అడగాలి. అపుడు ఊరి జనం దేనినీ గుడ్డిగా నమ్మకుండా వుంటారు. ఊరి ప్రజల సాయంతో పోలీసులు దొంగలను సులువుగా పట్టుకోగలుగుతారు" అన్నారు.

"అలాగే పార్‌గావ్ వెల్దాం. సోన్‌కొండ రహస్యం అందరికీ తెలియాలి. అప్పుడే జనంలో మూఢనమ్మకాలు పోతాయి," అన్నాడు ఇనస్పెక్టర్.

(9)

దొంగలను పట్టు కున్నందుకు సుభాష్‌కీ అతని మిత్రులకి పోలీసు శాఖ అయిదువేల రుపాయల బహుమతి యిచ్చింది. వాళ్ళంతా కలసి చట్ట ప్రకారం ఒక మిత్రమండలి స్థాపించారు. సోలాపూర్‌కి చెందిన 'రామ్‌భావూ' పాత యింటిని రెండు వేల రూపాయలకి కొన్నారు. వూరి ప్రజలు కూడా చందావేసుకున్నారు. యువకులు శ్రమపడి ఇంటిని బాగుచేసారు.

ఉదయం అయిదు గంటల నుండి అక్కడ వ్యాయామశాల

మొదలవుతుంది. ఎనిమిది గంటలకు ఆసుపత్రి తెరుస్తారు. ప్రక్క వూరి వైద్యుడు వచ్చి బీదలకు వుచితంగా వైద్యం చేస్తాడు. తర్వాత బాల్వాడీ. మళ్ళీ మధ్యాహ్నం రెండు గంటలకు మహిళా మండలి. అక్కడ స్త్రీలకు అల్లికలు, కుట్లు నేర్పుతారు.

సాయం కాలం అయిదు గంటలకు యువకులు చేరతారు. చర్చలు, గోష్ఠులు ప్రసంగాలు, కుస్తీ, నాటకాలు, న్యాయ సల హాలు ఏడుగంటల వరకుసాగుతాయి. తర్వాత ఏడున్నర గంటల నుండి వయోజన విద్యా తరగతులుంటాయి. సోలాపూర్ ఇంటికి "పార్‌గావ్ సమాజ మందిరమని" పెట్టారు. ఈ సమాజ మందిరం రోజంతా కళ కళ లాడుతూ వుంటుంది.

ఈ పనులకు సుభాష్ అతని మిత్రులకు నాలుగువేల రుపా యలు ఖర్చయింది. మిగిలిన సొమ్ముతో కొండదారిని బాగుచే యించారు. గుడిని శుభ్రం చేయించారు. గుడి లోపల గాంధీజీ విగ్రహం పెట్టారు. నాలుగు వైపులా మంచి అరుగులు కట్టారు. నీళ్ళటాంకు మరమ్మత్తు చేయించారు.

కొండ మీద కొత్తగా చెట్లు నాటారు. ఇప్పుడు సోన్ కొండ ఎంతో అందంగా తయారయింది. చుట్టు పక్కల బడి పిల్లలు షికా రుకి అక్కడికి వస్తూ వుంటారు. గుడి దగ్గర ఎంతో సందడిగా వుంటోంది.

Lasertypeset at PRINTOFAST, 11/4, Old Rajinder Nagar, New Delhi -110060
and printed at Tara Art Printers, Sector V, NOIDA.

ఈ పుస్తకం నవసాక్షరుల కోసం ప్రచురింపబడింది. మీరు నవసాక్షరులైతే ఈ దిగువ యివ్వబడిన ప్రశ్నాపత్రాన్ని తెల్ల కాగితం పై రాసి పూర్తిచేసి కింద యివ్వబడిన చిరునామాకి పంపండి. ఇది మాకు ఇంకా మంచి పుస్తకాలు ప్రచురించేదుకు సహాయపడుతుంది.

1. పూర్తి పేరు
2. వయస్సు
3. మాతృ భాష
4. వృత్తి
5. నెలసరి ఆదాయం
6. పూర్తి అడ్రసు
7. అక్షరాస్యతకి సంబంధించిన వయోజన వాచకాలలో ఎన్ని భాగాలు మీరు చదివారు?
8. చదవడం, రాయడం మీరు ఏకార్యాలలో ప్రయోగిస్తారు?
9. మీరు పేపరు చదువుతారా? - అప్పుడప్పుడు, తీరికవేళల్లో, ప్రతిరోజూ?
10. మీరు పుస్తకాలు చదువుతారా? - అప్పుడప్పుడు, తీరికవేళల్లో, ప్రతిరోజూ?
11. మీకు ఎటువంటి పుస్తకాలు చదవడానికి కావాలి?
12. ఈ పుస్తకంలోని విషయం మీకు నచ్చిందా?
13. మీరు ప్రతినెలలో పుస్తకాల కోసం ఎంత డబ్బు ఖర్చు పెట్టగలరు?

ఈ దిగువ చిరునామాకి పంపించండి :

సంపాదకీయ విభాగం
నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
ఎ-5, గ్రీన్ పార్క్
న్యూఢిల్లీ - 110016